జే పీ ప్రచురణ

ప్రభుత్వ స్థానింగు సభ్యుడు గా నియమింపబడినవల్ల
మొదటి భాగంలోనున్న అడ్వొకేట్ జనరల్ ఈ భాగం
మీద సంతకం చేయటానికి వీలు లేకపోయింది.

సంపాదకులు :

బొందలపాటి శకుంతలా దేవి

శివరామకృష్ణ

# పీఠిక



## 1. తొలి మాట :

మా మొదటి విజ్ఞప్తిలో ముఖ్యంగా ఉత్పత్తి సమస్యనుగూర్చి చర్చించాం. పూర్వాపర సందర్భశుద్ధి చూచినా, అవసరోపయోగాలను లక్షించినా ఒక ఆర్థికాభివృద్ధిపథకంలో పంపక సమస్యకుముందే ఉత్పత్తి సమస్య వస్తుంది. ఉత్పత్తి అతిస్వల్పంగాఉండే ఇండియా వంటి దేశంలో పంపకవిధానం ఎంత నిర్దుష్టమైనదైనప్పటికీ ఉత్పత్తి అధికతరం అయితేనేతప్ప ప్రజల జీవన ప్రమాణం పెరగదు. అట్లని సక్రమమైన పంపకవిధానం లేనిదే కేవల అధికోత్పత్తిమాత్రమే దేశదారిద్ర్య సమస్యను పరిష్కరించగలదని భావించగూడదు. ఈ ప్రస్తుత విజ్ఞప్తిలో పంపకవిధానాన్నిగురించీ, దాన్ని అమలుజరిపే విషయంలో ప్రభుత్వం వహించవలసిన బాధ్యతలను గురించీ మా అభిప్రాయాలను విశదీకరిస్తున్నాం.

## 2 విషయాభిగమనము :

మేమీ సమస్యను ద్విముఖంగా అభిగమిస్తున్నాం. ఒకవంక ప్రస్తుతం అమలులోఉన్న ధనస్వామ్యపద్ధతి. జాతీయాదాయాన్ని సక్రమంగా పంపకం చెయ్యలేక పోతున్నసంగతిని గమనిస్తూనే ఉన్నాం. మరొకవంక ... అందులో బట్టబయలుగా ఎన్నిలోపాలుఉన్నా అదికాల పురుషుని కత్తికి భిన్నంకాకుండా నిల్చివుంది; కొన్ని కొన్నిఉత్కృష్టఫలితాలు ప్రసాదించింది కూడాను; కాగా అందులో కొన్ని సుగుణాలు ఉన్నాయని ఒప్పుకుంటున్నాం. కాబట్టి ఈప్రస్తుత విధానంలోని లోపాలు దిద్దుకోకపోవటం ఎంత తెలివితక్కువపనో... ఇన్నాళ్ళనించి పలుముఖాల చాలవరకు విజయవంతంగా సాగివచ్చిన ఆ విధానాన్ని మొదలంట పెంకివేయటంకూడా అంత పెద్ద అపరాధమే.

**3 రెండు పునాదిరాళ్ళు :** అందుచేత మేము మార్పును ఉద్దేశిస్తున్నాం. ఆర్థిక సౌష్టవము, క్రమాభివృద్ధి— వీటిని మేము లక్ష్యంలో పెట్టుకున్నాం. దేశ భవిష్యదార్థిక వ్యవస్థ ఫలవంతంగా సాగవలెనంటే అవి రెండున్నూ ఆధారశిలలని మా గట్టినమ్మకం. అది

స్వేచ్ఛా ఉద్యమానికి దోహదం ఇవ్వాలి. ఆ ఉద్యమం ఉదాత్తమైనదిగా ఉండాలి—గాని నీచమైన అతిసంచయ బుద్ధికి మేలి ముసుగుగా ఉండకూడదు. ఉద్యమంద్వారా, కృషిద్వారా లభించే ఫలసాయమంతా అందుకు తోడ్పడిన వారందరికీ న్యాయంగా పంపకం కావాలి; ఏ కొద్ది మంది గుప్పెట్లోనో నిల్చిపోకూడదు.

# II

# జాతీయాదాయ పంపకం

## 4. ఉత్పత్తిపంపక సమస్యల బాంధవ్యం:

జనసామాన్యము యొక్క జీవన ప్రమాణాన్ని హెచ్చించటమే! మా మొదటి విజ్ఞప్తిలో వివరించ బడిన ఆర్థికపురోభివృద్ధి పథకంలోని ముఖ్యోద్దేశం. నిజానికి దారిద్ర్య నిర్మూలనకు సాధనం కాని అధికోత్పత్తి నిష్ప్రయోజనమే. ప్రజల జీవన ప్రమాణం పెరగవలెనంటే ఉత్పత్తి అధికం కావాలి; అది సక్రమంగా పంపకం కావాల. ఈ రెంటిని గురించీ మేము విడివిడిగా చర్చించి నప్పటికీ వాటికి పరస్పర సంబంధం ఉంది; అవి పరస్పరాశ్రితాలు కూడాను.

## 5. ఆర్థిక తరతమభేదాలు :

ప్రస్తుతం మన ఉత్పత్తి అతిస్వల్పం; అది సరిగా పంపకం కావటం లేదుకూడాను. 1931—32లో సగటున వ్యక్తి ఆదాయం 65రూ. ఈవిషయం మా మొదటి విజ్ఞప్తిలో తెలియజేశాం. ఇది కేవలం గణితం వేసి తేల్చినసంఖ్య. ఈ మొత్తానికి, దేశంలో అధిక సంఖ్యాకులు ఆర్జించగలుగుతూన్న ఆదాయానికీఎంతో వ్యత్యాసం ఉంది. వారి ఆర్జన ఈ సగటు ఆదాయంకంటే చాల తక్కువ అదిగాక ...గ్రామాల్లో యీ వ్యక్తి ఆదాయం 51రూ; పట్నాల్లో166 రూ 1931—32లో పట్నాల్లోని మొత్తం రాబడిలో సగభాగం పట్టవాసులలో 10% కన్న తక్కువమంది చేతుల్లోఉంది, "సంవత్సరానికి 2000రూ మించిన ఆదాయంగల ధనికవర్గాల వారిలో కూడానూటికి 38 మందిచొప్పున మొత్తం పట్నాల ఆదాయంలో 17 శతాంశలు మాత్రమే కలిగి వుంటారు; నూటికి ఒక్కరు పైగా మొత్తంఆదాయంలో10శతాంశలుకలిగిఉన్నారు" గ్రామాల్లో అధిక సంఖ్యాకులైన ప్రజల ఆదాయం సగటు వ్యక్తి ఆదాయమైన51రూ కంటే చాల తక్కువ. ఎందుచేతనంటే వ్యవసాయదారులైన గ్రామీణులలో చాలమందికి జీవనాధారంగా వున్న భూమి రెండెకరాలకు మించదాయెను, అంతేకాక రైతున్నూ, అతని క్రింద

రోజుకు రెండుమూడణాలు జీతం పొందుతూన్న కూలి వాడున్నా, సంవత్సరం మొత్తం మీద 3,6 నెలలు పని లేక ఖాళీగానే ఉంటున్నారు. పైగా 1931 నించీ జనాభాలోని కొనుగుడుల కూడ పీగ ఆర్థిక ఒత్తిడిని అధికం చేసింది.

6. నక్రమమైన పంపకం :

కొనుగోలు దారు అవసరాన్నిబట్టి మాత్రమే ఉత్పత్తి కావలసిన సరుకుల మొత్తం స్వభావము నిర్ణయించేట్లయితే... ప్రస్తుతం వివిధ తరగతులవారి ఆర్జనశక్తులలో ఉన్న ఘోర తరతమభేదాలవల్ల దేశంలోని ఉత్పత్తి శక్తులు దెబ్బతింటాయి. కొనుగోలుశక్తి అతి స్వల్పంగా ఉన్న లక్షలాది ప్రజలకు ఉత్పత్తి మొత్తాన్ని నిర్ణయించే అధికారం ఉండదు. అది ఏకొద్దిమంది చేతుల్లోనో ఉండిపోతుంది. తత్ఫలితంగా సంఘంలో విభేదాలు పెరిగి, ఐకమత్యం చెడుతుంది. ఉత్పత్తి శక్తులు ధనస్వాముల అవసరాలను తృప్తిపరచేవి మాత్రంగా తయారౌతవి. మిగిలిన లక్షలాది ప్రజలకు సరియైనతిండి, బట్ట, ఇల్లు, విద్య, వైద్య సౌకర్యం లభించవు. ఆర్జన శక్తుల వ్యత్యాసాలు ఇంత ఘోరంగా ఉన్నంత కాలమూ మా ప్రణాళికలో మేము ప్రతి పాదించే అధికోత్పత్తి

సాధ్యమవటం చాల కష్టం కాబట్టి అధికోత్పత్తి ఆదర్శంగా కల ప్రణాళికలో నిష్పాక్షికమైన పంపక విధానం కూడా ముఖ్యాంశమై ఉండాలి. అట్టి ప్రణాళిక యొక్క ఉద్దేశాలు రెండు (1) సబబైన జీవిత ప్రమాణాలబ్ధికి అవసరమైన కనీస ఆదాయాన్ని ప్రతి వ్యక్తికి కల్పించటం (2) వివిధ తరగతులవారి ఆర్జన శక్తులలో నిఘోర తరతమ భేదాలను అంత మొందించటం.

## 7 ఉత్పత్తి విధానాల యాజమాన్యం:

ఉత్పత్తిశక్తులన్నీ ఏ కొద్దిమంది ప్రజల చేతుల్లోనో కేంద్రీకృతాలు కావటంచేతనే ఈ ధనికదరిద్ర విభేదాలు కలుగుతున్నాయి. ఒక్కొక్కప్పుడు ఈ విభేదాలవల్లనే ఉత్పత్తిశక్తులు ఏకొద్దిమంది యాజమాన్యంలోనో నిల్చిపోవటం తటస్థిస్తూన్నదికూడాను. ఉదాహరణంగా-బ్రిటన్ లో 25 ఏండ్లకు మించినయువకుల్లోనూటికి ఒక్కరికి వంతున... వారిఆస్తులనించి వచ్చేఆదాయం... మొత్తం దేశీయ ఆదాయంలో 20 శతాంశలకుమించి ఉంటుంది. ఆస్తిపాస్తులవల్ల వచ్చే ఆదాయాలు సమానంగా పంపకంకానిపక్షంలో దేశీయాదాయంకూడాసమానంగా పంపకంకాదన్నమాటే. కాబట్టి జాతీయఆదాయం సరిగాపంపకం కావలెనంటేధనాదాయాలలో, ఆస్తిపాస్తు

లలో ఇప్పుడున్న తరతమ భేదాలను తగ్గించాలి; ఉత్పత్తి శక్తులు వికేంద్రీకరింపబడాలి. మరణసుంకాలు మొదలైన పన్నులు విధించి... ప్రజాక్షేమం కోరే ప్రభుత్వం పూనుకుంటే... మన మొదటి ఆశయం నెరవేరుతుంది. మేము సూచింపబోయే భూమికౌలు విధానాల సంస్కరణ అమలుపరచకపోయినా ఈవిషయంలో మనం కొన్ని ఫలితాలు పొందగలం. దేశ అవసరాల ఉత్పత్తినిమిత్తం కుటీరపరిశ్రమల అభివృద్ధికి కావలసినన్ని అవకాశాలు కల్పించవలెనని మా మొదటి విజ్ఞప్తిలో మనవిచేశాం. జాయింటు స్టాక్ కంపెనీల షేర్లు అధికం చేయటం వల్ల... పరిశ్రమలు అన్ని ప్రాంతాల్లోనూ విరివిగా స్థాపించటం వల్ల... సహకార పరపతి సంఘాలు నెలకొల్పటంవల్ల.. ఉత్పత్తి శక్తులు వికేంద్రీకరింపబడతాయి. ప్రజోపయోగ వస్తూత్పత్తిపరిశ్రమలు, ప్రాతిపదిక పరిశ్రమలు, ప్రభుత్వపు అధికారంలో— కొన్నిసమయాల్లో ప్రభుత్వపు ఆధిపత్యంలోనూ, మేనేజిమెంటులోనూ— ఉండేట్టయితే జీవనోపాధులలోని ప్రస్తుత మహాదంతరాలు తగ్గిపోగలవు.

## 8 హెచ్చుతగ్గుల్ని పూర్తిగా మాపుచెయ్యటం అవాంఛనీయం :

ప్రస్తుతపు ధనిక దరిద్ర విభేదాలు ఉండకూడనివే. అయినా వాటిని పూర్తిగామాపుచెయ్యటం దేశాభ్యుదయ హేతువుకాదని మనంగమనించాలి. సుఖంగా జీవితం గడపటానికి అవసరమైనకనీసజీవనోపాధిని కల్పించిన తర్వాత... వ్యక్తులయొక్క శక్తిసామర్థ్యాలనుబట్టి సంభవించే వారివారి ఆర్జనల తారతమ్యాలను అవకాశాలను కల్పించవలసినదే. అందుమూలాన ఆర్థికపురోభివృద్ధికి అవసరమైన ఉత్పత్తిశక్తులను ప్రోత్సాహమిచ్చినట్లు వుతుంది. సోషియలిస్ట్ రష్యాలోకూడా సర్వసామ్య సిద్ధాంతపు మొదటి ఉద్రేకం తగ్గగానే... పారిశ్రామిక ఆదాయాలలో తారతమ్యాలు ఉండవచ్చునని అంగీకరించారు. ఇందునుగూర్చి కీన్స్ (Keynes) ప్రభువు వాక్యాలు గమనించతగినవి: జీవనోపాధులలోని వ్యత్యాసాలు ఇప్పుడున్నంత ఘోరంగాఉండరాదు; గాని... తగు పాళంగా ఉండటము సాంఘికంగాను మానసికంగాను మంచిదే. ధనసంచయవాంఛ, 'ఇదినాది' అనిచెప్పుకోతగిన ఆస్తిని ఆర్జిద్దామన్నకోరిక-ఇవిరెండూ ఉత్సాహశక్తులుగా

మాలు ఉన్నవి. అదీకాక... మానవునిలో సహజంగా ఉండే కొన్ని దుష్టశక్తులుగా బాష్ట్యానికీ, దురాక్రమణకూ, అధికార సంపాదనకు దొరకొనకండా... ధన సంచయాపేక్షతో నిరపాయకరములైన ఇతరమార్గాల్లో పరివర్తనము చెందవలసియున్నది.

ఉత్పత్తి దార్లకు ప్రతిఫలం:

ప్రజోపయోగ వస్తూత్పత్తి పరిశ్రమలు, ప్రాతిపదిక పరిశ్రమలు ప్రభుత్వపు అధీనంలో ఉంచటం వల్ల ఉత్పత్తి శక్తులను వికేంద్రీకరించటం వల్ల—ఉత్పత్తిదారులందరికే సరియైన ప్రతిఫలం ముట్టచెప్పటంవల్ల—సంఘంలోని ఆర్థికవ్యత్యాసాలు తగ్గిపోతాయి. ఉత్పత్తిదారుని శ్రమను బట్టీ - ఉత్పత్తియైన వస్తువు అవసరాన్నిబట్టీ - అతనికివ్వవలసిన ప్రతిఫలం - అంటేకూలి వడ్డీ, లాభం మొదలైనవి నిర్ణయం కావాలి. కూలి ఎప్పుడూకూడా ఒక నిర్ణీత కనీసప్రమాణానికి తగ్గరాదు; వడ్డీరేట్లు ఒకహద్దును అతిక్రమించ కూడదు, ధరలు కేటాయించి... పన్నులు, వాటాలు మొదలైన వాటిని వినిమయంచేసి... లాభాలకు కూడా హద్దులు నిర్ణయించాలి. అధికోత్పత్తి, సరుకుల నాణ్యము మనదృక్పథంలో ఉండితీరాలి.

## 10 కనిష్ట జీవనపరిమాణానికి మార్గాలు:

ఒక కనీస జీవన పరిమాణము లభ్యమయ్యేటందుకు రెండు రకాల విధానాలు సూచిస్తున్నాం:(1)ఆదాయపు పరిమితిని పెంపుచేసేటు వంటివి. (2) వ్యక్తి జీవితావసరాలకు అయ్యే ఖర్చును తగ్గించేటు వంటివి.

## 11 ఆదాయపు పరిమితి;

ఆదాయపు పరిమితిని పెంపుచేసే విధానాలు

i ఉద్యోగాలు కల్పించటం

ii సాధనసామర్థ్యాల పెరుగుదల

iii పల్లెలలోనూ, పట్నాల్లోను కూలిరేట్లను పెంచటం

iv వ్యావసాయిక ధరల హామీ; సహకార సంఘాల అభివృద్ధి

v భూమి కౌలు విధానాల సంస్కరణ, వీటిని గూర్చి ముందు పేరాలలో వివరిస్తున్నాం :

## 12 ఉద్యోగాలు:

ఇండియాలో అదాయపు పరిమితి వృద్ధి కావలెనంటే... నౌకరీలను సంపూర్ణంగా అందరి అందుబాటులో ఉద్యోగాలు చేయటాన్ని సాధింపదియె ఉన్నది.

ఎంతమంది నిరుద్యోగులుగా ఉన్నారో, మరెంతమందికి చాలినంత ఉద్యోగం లేకుండా ఉన్నారో - ఈవిషయాలను గురించిన వివరాలు మనకు తెలిసే అవకాశాలు లేవు, అయినా ప్రజల దారిద్ర్యానికి ఉద్యోగాలు దొరక్కపోవటం ఒక ముఖ్యకారణం. దేశంలో పనిమంతులందరికీ చేతినిండా పని కల్పించటం కష్టసాధ్యమే; కాని అట్లు చేయకుండా సుఖప్రదమయిన జీవితప్రమాణం దుర్లభమే; "సోమరితనం అనే రాక్షసిని నిర్మూలం చేసిననాడు పునర్నిర్మాణాశయాలన్నీ మన హస్తగతాలౌతవి. లేనినాడు అవి అందని మ్రానిపండ్లే మనకుఫలితం శూన్యం" చేతినిండా పని కల్పించామంటే ప్రతి వ్యక్తికీ జీవనోపాధిని ప్రసాదించామన్న మాటే.

## 13 పారిశ్రామిక నౌకరీలు:

మా మొదటి విజ్ఞప్తిలో సూచించిన పారిశ్రామిక విస్తరణ సాధ్యమయిన నాడు చాలమందికి పని దొరుకుతుంది. ఇందుకోసం... ప్రస్తుత పారిశ్రామిక దేశాల్లో కంటే కార్మికుని పెట్టుబడి దామాషా ప్రకారం చాల తక్కువగా ఉండటము... కుటీర పరిశ్రమలు సంపూర్ణంగా అభివృద్ధి చెందటానికి అవకాశాలు కల్పించటము... అవసరమని సూచించి ఉన్నాం. ఈవిషయం

లో జపాన్ అనుభవంనించి భారతదేశం ఒకపాఠం నేర్చుకోవచ్చు. ఇండియాలోవలె జపాన్‌లో కూడా పని వాళ్ళు ఉన్నారే గాని పెట్టుబడి లేదు. 1930 లో జపాన్ ఉత్పత్తి పరిశ్రమలలోని కార్మిక జనులలో సగంమంది 5 గురికి మాత్రమే పని ఉన్న చిన్నచిన్న కర్మాగా రాలలో పనిచేస్తూ ఉండేవాళ్ళు నూటికి 70 మంది చొప్పున... 50 మందికి పని ఉన్న కర్మాగారాలలో ఉండేవాళ్లు Ministry of Commerce & Industry వారి రిపోర్టు ప్రకారం 5—30 మంది పనివాళ్లతో మాత్రమే నడిచే కర్మాగారాలలో...నూటికి 29 మం దికి చొప్పున నౌకరీలు దొరికాయి; మొత్తం ఉత్పత్తి లో 19 శతాంశలు ఇట్టి కర్మాగారాల్లోనే తయారౌ తుంది. చైనాలో ఇటీవల అభివృద్ధి చెందిన పారిశ్రా మిక సహకార పరపతి సంఘాలు మనకు మార్గదర్శ కాలు. ఉత్పత్తి అధికమైన కొద్దీ...జీవన ప్రమాణం పెరిగినకొద్దీ...తప్పని సరిగా ఇంకా వర్తక వ్యాపారాది ఇతర సంస్థలు వృద్ధిచెందుతాయి. చాలమంది ప్రజలకు పరిశ్రమలలోనే కాక ఇతర ఉద్యోగాలు లభించగలవు. గాని అంత మాత్రాన వ్యవసాయ వృత్తిలో అంతర్గ ర్భితమయి ఉన్న నిరుద్యోగస్థితి పరిష్కారం కాజాలదు. అదిచాల ప్రముఖమైన సమస్య

## 14 కొన్ని ఋతువులలో వ్యవసాయదారుని నిరుద్యోగత

రైతులు, వ్యవసాయ కూలీలు సంవత్సరం మొత్తం మీద 3—6 నెలలు పనియేమీ లేకుండానే ఉండవలసిన వస్తున్నది. ఇది వారికి పైరు, పంటలు సాగని ఋతువులలో సంభవిస్తున్నది. దేశంలో అందరికీ చేతినిండా పని కల్పించవలెనన్న మన ఆశయం నెరవేరవలెనంటే- ఈసమయాల్లో వారికి పనులు కల్పించటం ఎంతో అవసరం. ఇందుకు మాసూచనలు:

i వ్యవసాయంతో పాటు డెయిరీ ఫారమింగ్, తోటల పెంపకము మొదలైన పనులు సాగించాలి.

ii నీటి పారుదల వసతులు అధికం చేసుకుని...ఎరువులను ఎక్కువగా ఉపయోగిస్తూ... సంవత్సరానికి రెండు మూడు పంటలు పండించటానికి ప్రయత్నం చెయ్యాలి,

iii పొలము పనిలేనప్పుడు వ్యవసాయదారునికి కొన్ని ఉపవృత్తులు: నూలు వడకటం, నేతపని, చెప్పులు కుట్టటం, కాగితం చెయ్యటం తోళ్ళు సాఫీచెయ్యటం, సబ్బులు, తయారు చెయ్యటం, నూనె గానుగ ఆడించటం, పళ్ళు నిలువ చెయ్యటం, బుట్టలు అల్లటం, పిండి విసరటం.

ఇత్యాదులు:—

## 15 వృత్తి విభజన:

ఈప్లాను అమలు జరిగిన తర్వాత వృత్తివిభజన స్వరూపం ఇప్పటికన్న భిన్నంగా ఉండక తప్పదు.

వృత్తి విభజన లెక్కలు, మున్ముందుగా రాబోయే మార్పులు తెలిసివున్న దేశాల్లో కూడా 15, 20 సంవత్సరాల అనంతరం ఉండబోయే వృత్తి విభజన స్వరూపస్వభావాలను పొల్లుపోకండా అంచనా వెయ్యటం కష్టం. ముఖ్యంగా ఇండియాలో మరీకష్టం, ఎందుచేతనంటే, 1941 జనాభా వృత్తివిభజన లెక్కలు ఇంకా ప్రచురం కాలేదు. అయినా ఈ ప్లాను అమలు జరిపిన తర్వాత ఉండబోయే వృత్తి విభజన స్వరూపాన్ని ఉజ్జాయింపుగా సూచన చేయవచ్చును, ఈప్లాను అమలు చెయ్యబోయేముందు వృత్తి వారీ దామాషా 1941 లో లాగేఉంటుందనీ—1941 జనాభా లెక్కల ప్రకారం తేలినట్టు మున్ముందు కూడా జనసంఖ్య ఏడాదికి 5 మిలియన్ల చొప్పున వృద్ధి అవుతూ వుంటుందనీ - అనుకుందాం. 1931 జనాభాలెక్కల ప్రకారం ప్రజా పరిపాలన శాఖలు, వ్యాపారములు, రవాణా స్వతంత్రవృత్తులు మొదలైనవాటిలో కుదురుకొనియున్న వారు పారిశ్రామిక నౌకరీలలో ఉన్నవారిలో 30శతాంశలు ఉన్నారు. ప్లానులో సూచితమైనవిధానాల ననుసరించి విద్యాశాఖ, ఆరోగ్యశాఖ, మొదలైన ప్రజా సేవక సంస్థల అభివృద్ధితో పాటు - దేశపరిపాలన, రక్షణాల నిమిత్తం ఏర్పడే క్రొత్త అవసరాల ననుసరించి ఈ ప్లాను అమలు జరిగిన నాటికి ఇప్పటికన్న అధిక సంఖ్యా

కలుగా। ప్రజలు నౌకరీలలో కుదురుకోగలరు. దేశంలో ఆర్థిక సౌష్టవం నెలకొన్నప్పుడు వర్తకము, రవాణా శాఖోద్యోగాలు అభివృద్ధి చెందుతవి. మా మొదటి విజ్ఞప్తిలో ప్రతిపాదించిన ఇతర నౌకరీల విస్తరణ పారిశ్రామిక నౌకరీల విస్తరణకంటే దామాషా ప్రకారం చాల తక్కువ కాబట్టి ప్లాను అమలు జరిగిన నాటికి ఇతర నౌకరీలలో నియోజితులైన వారి సంఖ్య పారిశ్రామికోద్యోగుల సంఖ్యలో 60 శతాంశలు ఉండవచ్చునని అంచనా వేస్తున్నాం. ఇంకా మిగిలినవారు వ్యవసాయం మీద ఆధారపడి ఉంటారు. కాబట్టి ప్లాన్ అమలు జరిగిననాడు, అంటే 1962 లో వృత్తి విభజన ఈ క్రింది విధముగా ఉండవచ్చు.

| | 1931 | | 1962 | |
|---|---|---|---|---|
| | మిలియన్లు | శాతము; | మిలియన్లు | శాతము |
| వ్యవసాయం | 106. 3 | 72 | 129. 7 | 58 |
| పరిశ్రమలు | 22. 1 | 15 | 57. 9 | 26 |
| ఇతరోద్యోగాలు | 19. 2 | 13 | 34. 7 | 16 |
| మొత్తం నౌకరీలలో ఉన్నవారు | 147. 6 | 100 | 222. 3 | 100 |

## 16 ఉద్యోగాల పంపకవిధానం అసంపూర్ణమైనది :

నౌకరీలన్నీ సంపూర్ణంగా అందరిప్రజల అందుబాటులో ఉండవలెనని ఎంత కృషిజేసినా, కావలసిన ప్రతివాడికీ నౌకరీ దొరకగలదని చెప్పలేము. ఒక సాంఘిక కార్యక్రమం అమలు జరుపటంలోనే లోటుపాట్లు తప్పని సరిగా ఉంటాయి; అనుకోనిఆటంకాలెన్నో అడ్డు వస్తాయి.

అంతేకాక ... ఇండ్లు కట్టటం మొదలైన పనులు కొన్ని రుతువులలో మాత్రమే సాగేటువంటివి కాగా మిగిలిన రుతువులలో వారికి పని ఉండదు. పైగా ఉత్పత్తి విధానాలలోని మార్పులవల్ల... ఉత్పత్తి సరుకుల అవసరానవసరాలవల్ల ... పనిలో ఉన్నవారే అనేకులు తొలగింపబడటంకూడా జరుగుతుంది. ఈకారణాలవల్ల కొన్ని కొన్ని సమయాల్లో ఏర్పడే నిరుద్యోగతను అరికట్టవలెనంటే ఉద్యోగాల పంపకవిధానం అత్యంత సౌష్ఠవమైనదిగా ఉండాలి. ఈప్లాను సాగి, దేశంలో ఆర్థికపరిస్థితులు కొంతవరకు చక్కబడిన తరువాత ... ఆకస్మికంగా చిరకాల నిరుద్యోగత సంభవించిన వారికి సహాయార్థంగా కొన్ని భీమాపద్ధతులు కూడా అమలులో పెట్టవచ్చును
ప్రజోపయోగార్థం [illegible]

కావించేటప్పుడు గవర్నమెంటువారు అట్టి నిరుద్యోగులకు పని కల్పించటం ఆశయంగా పెట్టుకోవాలి. సాంకేతికశాస్త్ర పరిజ్ఞానం చాలక ఉద్యోగార్హత లేనివారికి తర్ఫీతు ఇవ్వాలి. ప్లాను సాగిస్తున్న కొద్దీ మనం అనుసరించే నిర్మాణ కార్యక్రమమే నిరుద్యోగ సమస్యను చాల వరకు పరిష్కరించగలదు.

## 17 సాధనసామర్థ్యాల పెరుగుదల:

కార్మికులలో సాధారణ - సాంకేతిక - విద్యావ్యాప్తివల్ల - చిన్నచిన్న కుటీర పరిశ్రమలు స్థాపించటంవల్ల - వ్యవసాయం, వ్యాపారం, పశుసంపద, విద్యుచ్ఛక్తి సప్లయి, వృద్ధికావటంవల్ల కొత్తకొత్త వ్యవసాయపు పనిముట్లు, ఎరువులు విరివిగా ఉపయోగించటంవల్ల-ఉత్పత్తి చురుగ్గా సాగినప్పుడు ఉత్పత్తిదారుని ఆదాయం పెరుగుతుంది. తత్ఫలితంగా ప్రజల జీవితప్రమాణం హెచ్చవుతుంది.

## 18 గ్రామాల్లోను, పట్నాల్లోను కూలిజీతాలు:

ప్రతి వ్యక్తికీ ఒక కనీస జీవనప్రమాణం లభ్యం కావాలంటే కూలీరేట్లు పెరగాలి. కార్మిక - కర్షకుల కూలిరేట్లలో ప్రస్తుతం ఉన్న వ్యత్యాసాలు అంతరించ

గల మార్పులు అవసరం. మొట్టమొదట వ్యవసాయ కూలీల జీతాల్లో పెంపురావాలి. 1931లో వాళ్ళ జన సంఖ్య ౬0 మిలియనులు. గ్రామీణుల జీవనప్రమాణం పెరిగితేనేగాని కార్మికుల జీవన ప్రమాణం పెరగదు. యుద్ధానికి పూర్వం వ్యవసాయ కూలీల జీతాలు: మగ వానికి రోజుకు ౨-5 అణాలు: స్త్రీకి 1½-4 అణాలు; పిల్లలకు 1-2 అణాలు 1939 లో బొంబాయి రాష్ట్రంలో సగటున వ్యవసాయ కూలీల జీతం రోజుకు 5 అణాలు; సంయుక్త రాష్ట్రాలలో ౪ అ. 9 పై. ఇంత స్వల్ప జీతాలే కాక వాళ్ళకు సంవత్సర మంతా పని ఉండదు కూడాను. ప్రధాన అవసరాలకుకూడా చాలని జీవనోపాధితో వారు విలయవ్యాధులకు, కరువులకు ఆహూతి ఔతున్నారు. మొదటి విజ్ఞప్తిలో మేము సూచించిన విధానాల ప్రకారం వ్యవసాయాభివృద్ధి జరిగిన తర్వాత ఈ విజ్ఞప్తిలో మున్ముందు మేము సూచించ బోయే భూమి కౌలు విధానాల సంస్కరణలు అమలు జరిపిన తర్వాత - వ్యవసాయ కూలీలకు, ఆయా ఫిర్కాల ననుసరించి కనిష్ఠ వేతనాలు నిర్ణయించటంఅవసరం. ఈ పని ఇప్పుడు కష్టసాధ్యం అయినా... సమిష్టి వ్యవసాయ విధానం వృద్ధిచెందినప్పుడు సులభసాధ్యమే ఔతుంది.

## 19 కనిష్ట వేతనం :

ఇప్పుడు అన్ని వృత్తులలోనూ ఏర్ప రచ లేము కాని, ముందుగా నూలు, పంచదార, సిమెంటు, ఇంజనీరింగు, నార, ఖనిజములు - ఈ మొద లైన పరిశ్రమలలో ప్రవేశపెట్టవచ్చును. ప్రారంభ దశలలో ఈకనిష్ట వేతనం... ప్రస్తుతపు పారిశ్రామిక కూలి రేట్ల ననుసరించి నిర్ణయించాలి నెమ్మది నెమ్మది గా, కాలక్రమాన దాన్ని జీవితావసరాలకు చాలేట్టు పెంచాలి. ఈపనులు ఆయాపరిశ్రమల తరపున వ్యవహ రించే ఒక స్థాయి సంఘానికి ఒప్పచెప్పాలి. ఈసంఘంలో అధికార్లకు, పనివాళ్లకు, మరికొందరు మధ్యవర్తులకు ప్రాతినిధ్యం ఉండాలి.

## 20 వ్యవసాయధరలు:—

వ్యవసాయంలో పండే పదార్థాల ధరలలో సంభ విస్తూ ఉండే ఆకస్మిక మార్పులు రైతు ఉత్సాహానికి ఆఘాతాలు కాగా అతడు అధికోత్పత్తికి తగినంత కృషి చెయ్యలేడు. ముమ్ముందు ఈ ధరల ఆకస్మిక మార్పు లకు తావు ఇవ్వరాదు. తన పంటమీద 'ఇంత ధర వసుంది, పరవాలేదు' అనే తృప్తి రైతుకు కలగాలి.

ఇందుకు మాసూచన ఏమంటే—వ్యవసాయపు ప్రధాన పంటలకు సర్కారువారు ఒక న్యాయమయిన ధర వినియమం చెయ్యాలి అలా చెయ్యటంలో ఉత్పత్తి ఖర్చు, ఆప్రాంతంలోనిజీవనఖర్చులు వారుగమనించాలి. అలాంటి ధరల వినిమయంవల్ల పదార్థాల నిలువలు ఏర్పాటై ధరలు అట్టే మారటానికి అవకాశాలు ఉండవు. విదేశాల నించి దిగుమతులవల్ల కొన్ని వ్యావసాయిక పంటల ధరలు పడిపోతై. కాబట్టి పన్నులువిధించీ, కోటాలు నిర్ణయించీ, ఈ దిగుమతి మొత్తాలను తగ్గించాలి. ముమ్ముందు అనేకరకాల వ్యావసాయిక పంటలు అంతర్జాతీయ - ఒడంబడికలకు బద్ధమయి ఉండవలసి ఉంటుంది. భారతదేశానికి స్వాతంత్ర్య ప్రతినిధ్యం ఉండేట్టయితే ఈ ఒడంబడికల వల్ల మన ప్రధాన పంటలకు కొన్నింటికి స్థిరమయిన ధరలే ఏర్పడగలవు.

## 21 పరపతి సంఘాలు:—

వ్యవసాయదారుడు తన పంటను విలియాపరచుకోటంలో అనేక రోకరాలు తింటున్నాడు. రావలసినంత సొమ్ము పంటమీద అతనికి రావటం లేదు. ఉత్పత్తినీ, తద్వారా తన ఆదాయాన్నీ పెంపుచేసుకోవాలన్న ఉత్సాహం అతనికి లేక పోవటానికి ఇదికూడా

ఒక ముఖ్యకారణం, కొనుగోలు దారుగాని, ఎగుమతి దారుగాని పెడుతున్న ధరకూ,...చివరకు రైతు చేతిలో పడే ధరకూ ఎంతో అంతరం ఉంటున్నది. రైతుకు పంట నిలువచేసుకునే వసతులు లేవు. అందుచేత కోతలు కాగానే అమ్మి పారేయవలసి వస్తున్నది. సాధారణంగా కోత లప్పుడు ధరలు చాల తక్కువ అదీగాక పంట కొనేవాడు అప్పిచ్చినవాడై ఉంటాడు. అప్పుక్రింద పంట అంతా ఏస్వల్ప ధరకో అతనికే దఖలు పడి పోతుంది. ఇట్టి ఒడంబడిక రాతకోతలు అదివరకే జరిగి వుంటాయి. ఏకొద్దిమంది రైతులో మాత్రం పంట అమ్ముకునేందుకు బస్తీలకు తీసుకు పోగలుగుతున్నారు. ఇతర్లు చాలామంది నిలువచేసుకునే వసతులు, అందుకు తగినంత ధన సహాయం లేక గ్రామంలోనే స్వల్పధరలకే అమ్మజూపుతున్నారు. సకలార్థ పరపతి సంఘాలను ఏర్పరచి నట్టయితే పంటను విలియాపరచుకోటంలో రైతులు అనుభవిస్తూన్న కష్టాలు తొలగిపోతవి. ఆర్థిక సహాయం...పంట నిలువచేసుకునే వసతులు... లేక వాళ్ళు పడే బాధలున్నూ పోతాయి, కొనుగోలు దారు పెట్టే ధరలో ఎక్కువభాగం వారికి దక్కుతుంది పరపతి సంఘాల్లో ఇట్టి రైతుసేవా దృష్టి అధికం కావాలి. తూకాలో కొలతలో మోసాల్ని, అరికటాలి విపణి

వీధిని సంస్కరించాలి. వ్యాపారపు తెలివితేటలు వ్యాపించాలి. అప్పుడు ప్రాథమిక ఉత్పత్తి దారునికి తగినంత ధర రావటానికి అవకాశాలు ఏర్పడతవి.

22 భూమికౌళ్ళు:

సమిష్టి వ్యవసాయం, నీటి పారుదల వసతులు.... వృద్ధి చేసుకోవాలి; భూమి నిస్సారం కాకుండా బంజరు పెట్టకుండా కాపాడుకోవాలి; ఇంతేకాక.... వ్యవసాయోత్పత్తి, వ్యవసాయదారుని ఆదాయము తగినంత వృద్ధి కావాలంటే కౌళ్ళ విధానంకూడా మార్పుచెందాలి. భూస్వామికత్వము, భూమికౌళ్ళు, భూమిశిస్తులు - వీటిని పరిశీలిద్దాం. ఇప్పుడు భారతదేశంలో భూమికౌలు విధానాలు మూడు అమలులో ఉన్నాయి 1 రైతువారీ పద్ధతి: దీని ప్రకారం భూమి వ్యవసాయ దారునిహక్కు భుక్తాల్లో ఉంటుంది. తానే స్వయంగా గవర్నమెంటు శిస్తులు చెల్లించుకుంటాడు. (2) మహాల్ వారీపద్ధతి: అగ్రహారాలు కొన్ని కుటుంబాల జాయంటు అధీనంలో ఉంటాయి. వారే శిస్తులు చెల్లించాలి. (3) జమీందారీ పద్ధతి: ఒక్కడుగాని,కొలదిమంది జాయంటుగాగాని భూ ఆస్తికి హక్కుదారులై వుండి వారే శిస్తులకు బాధ్యులై వుంటారు. మహాల్వారీ, జమీందారీ పద్ధతులకు దగ్గర

పోలిక ఉన్నవి. శాశ్వత కౌలువిధానము, అప్పుడప్పుడు కౌళ్ళు తిరుగ రాసుకునేపద్ధతి - రెండున్నూ అమలులో ఉన్నాయి కాని వీటితో మనకిప్పుడు పనిలేదు. బ్రిటిష్ ఇండియాలో రైతువారి, జమీందారి, మహాల్ వారి పద్ధతుల ప్రకారం భూమి ఈ క్రింది విధంగా విభజింపబడి ఉంది.

| | ఎకరాల వేలసంఖ్యలో | శాతము |
|---|---|---|
| రైతువారి ... ... | 183,034 | 36 |
| జమీందారీల మహల్ వారి: ... ... | 326,998 | 64 |
| మొత్తము. | 510,032 | 100 |

ఇండియాలో వ్యవసాయం ముఖ్యంగా కౌలుదారుల చేతుల్లోనే ఉంది. వీరు భూమిని జమీందార్ల దగ్గర నించో, పెద్దకాపుల దగ్గర నించో కౌలుకు తీసుకుని సాగుబడి చేసుకుంటారు. కాని జమీందారీ పద్ధతిని ఉన్న భూమి అంతా కౌలుదార్ల చేతుల్లోకి రావటం లేదు, రైతువారీ పద్ధతిని ఉన్న భూమి అంతా రైతుల చేతనే సాగుబడి అవటంలేదు. ఈవిషయాలు మనం గమనించాలి. ఉదాహరణంగా సంయుక్త రాష్ట్రం తీసుకుందాం అది ముఖ్యంగా జమీందారీరాష్ట్రం. మొత్తం

అక్కడ సాగుబడి ఔతున్న 35 మిలియన్ల ఎకరాల భూమిలో 5 వ వంతు నేల భూ ఆసాములచేతనే సాగుబడి అవుతున్నది. పంజాబులో అలాకాదు, అక్కడ రైతులే భూ ఆసాములుకూడాను. ఆరాష్ట్ర పశ్చిమ భాగంలో భూస్వాము లున్నారు. కాని వారికి ప్రాధాన్యంలేదు. జమీందారీ పద్ధతిలో ఉన్న భూభాగంలో కూడా వ్యవసాయం సాగిస్తూఉండే కౌలుదారుకే అన్ని హక్కులూ ఉన్నాయి. ఏవో కొన్ని అసామాన్య పరిస్థితులలో తప్ప అతను చెల్లించ వలసిన కౌలు మారదు అది ఒకేసారి శాశ్వతముగా నిర్ణీతమయి ఉంటుంది. ఈకౌలుదారుతనం వంశపారం పర్యంగా వచ్చేదే కౌలు రైతు యిష్టప్రకారం ట్రాన్స్ఫర్ చేసుకోవచ్చు అచ్చటి కౌలు చట్టాలు జమీందార్ల యాజమాన్యపు హక్కుల్ని తొలగించాయి. కాగా వారు కేవలం కౌలు వసూలుదార్ల మాత్రమే అయినారు. జమీందారీ. భూముల్లోని కౌళ్ళు రైతువారీ భూముల్లోని శిస్తులకు సరితూగుతవి,

## 23 రైతువారీ పద్ధతి:

భూ ఆసామిగాని, జమీందారుగాని కేవలం కౌలు వసూలుదారుగా మాత్రమే ఉంటున్న జమీందారీ

పద్ధతిలో సారస్యం ఏమీ లేదు. జాతీయ శ్రేయమూ లేదు. భారత దేశంలో ఎక్కడ చూచినా... భూస్వాములు భూమిని సారవంతం చెయ్యటానికిగాని, వ్యవసాయం అభివృద్ధి చెయ్యటానికిగాని, తమ రైతులకు పెట్టుబడిపెట్టి ప్రోత్సహించటం లేదు. జమీందారీ పద్ధతిలో ఉన్న కొన్ని లోటుబాట్లు రైతువారీ పద్ధతిలో రైతుకూ ప్రభుత్వానికీ దగ్గిర సంబంధం ఉంది, రైతుకు ఒక అంతస్తు ఉంది. కాగా సమిష్టి వ్యవసాయాన్ని వృద్ధి చెయ్యటం, నీటిపారుదల వసతులు కల్పించటం భూసారం చెడకుండా కాపాడటం - మొదలైన బాధ్యతలను ప్రభుత్వం గుర్తించటానికి అవకాశం ఉంది. అట్టి ప్రభుత్వసహాయం లేకండా రైతువారీ పద్ధతిలోనైనా వ్యవసాయాభివృద్ధి సంభవం కాదు. బెంగాలు భూమిశిస్తు విధానాలు గురించి ఒక రిపోర్టు తయారుచేసిన ఫ్లోడ్ కమిషన్ వారుకూడా జమీందారీ పద్ధతి రద్దుచేసి రైతువారీ పద్ధతి అమలు చెయ్యవలెనని సలహాయిస్తున్నారు, భూ ఆసామి తనభూమి సాగుబడి వ్యవహారాల బాధ్యత వహించకండా ఉన్న అన్ని జమీందారీ ప్రదేశాల్లో ఈసలహా అమలు పరచవలెనని మేము సూచిస్తున్నాం. ఆరంభంలో భూ ఆసామి బాధ్యతలు సర్కారువారు వహించి అతనికి న్యాయ్య బద్ధమయిన కౌలు కొంత చెల్లి

స్తూఉండాలి. ఆబాధ్యతలు నిర్వహించటాని కయ్యే ఖర్చులు ఈ కౌలులో మినహాయించవచ్చు. కొంతికాలం గడచినాక ఒకే పెద్దమొత్తం భూస్వామికి చెల్లించి అతని హక్కులన్నీ కొనివెయ్యాలి. ముఖ్యంగా భూస్వామికీ, రైతుకూ ఉన్న సంబంధం తెగగొట్టాలి. మొదట ఇంతేగాక ... సాగుబడి దారు చేతుల్లోనించి వ్యవసాయం చెయ్యని వారి చేతుల్లోకి భూమి ట్రాన్స్ఫర్ కాకుండా కాపాడాలి. రైతులు కానివారి ఆశాతృష్ణలు పడ కండా భూమి కౌళ్ళు వినిమయం చెయ్యాలి.

24 భూమి శిస్తు:

ఈ విధంగా రైతును భూ అనాథునిగా చెయ్యటమే కాకుండా భూమిశిస్తుల విధానంలో కూడా కొన్ని మార్పులు చెయ్యవలసి ఉంది. ఇప్పుడు శిస్తులు ఒకసర్వ సాధారణ నియమ బద్ధాలుగా లేవు. కొన్ని స్థలాల్లో కౌళ్ళను బట్టి... శిస్తు నిర్ణయింప బడుతున్నది. ధరల మార్పులను బట్టి శిస్తులు మారటంలేదు. సెటిల్మెంటు అధికార్లు వారి యిష్టప్రకారం కొన్ని కొన్ని పరిస్థితుల లో ఈ శిస్తులను మార్చే అధికారాన్ని కలిగియున్నారు. కాగా ఈ శిస్తురేటు ఒక్కొక్కచోట ఒక్కొక్క రీతిగా ఉంటున్నది. అత్యధికంగానూ ఉన్నది. ప్రస్తుత శిస్తుల

విధానంలో మార్పులు ఆశించేటప్పుడు మనం ప్రధానంగా లక్షించవలసిన విషయాలేమంటే—శిస్తుల్ని నిర్ణయించే ప్రాతిపదిక సూత్రాలు అన్ని ప్రదేశాల్లోనూ ఒకటిగానే ఉండాలి; అన్ని చోట్లా శిస్తురేటు సమానంగా ఉండాలి; ధరలలోని మార్పులను బట్టి శిస్తునుకూడా మార్చే ఏర్పాటు ఉండాలి; శిస్తులను తగ్గించటం కూడా అవసరం. ఇతర దేశాల్లో వ్యవసాయంమీద వచ్చే ఆదాయానికీ, ఇతరాదాయానికీ భేదం పాటించని వ్యవసాయంలో వచ్చే ఆదాయం మీదకూడా రాబడిపన్ను వేస్తారు ప్రస్తుతపు లేమి పరిస్థితులలో వ్యవసాయాదాయం మీద రాబడి పన్ను విధించటం సమంజసం కాదేమో! కాని ఒక హద్దును మించిన వ్యవసాయాదాయం మీద కూడా రాబడి పన్ను వసూలు చెయ్యవలె ననే మా ఉద్దేశం. ఈ పద్ధతి బెంగాలు బీహారు రాష్ట్రాలలో అమలు పెట్టారు.

## 25. 1962 లో ఆదాయ విభజన:

ఈపై విధానాల వల్ల ప్రస్తుతం అతి స్వల్పంగా ఉన్న వివిధ ఆదాయాలు క్రమేణా వృద్ధిచెంది... దేశ ఆర్థిక-పీఠం విశాలం ఔతుంది. అధికోత్పత్తితో, అధిక ధరలతో వ్యక్తుల ఆర్జనలు కూడా పెరుగుతవి. ఈ స్థాన

అమలు జరిగిన తర్వాత ప్రజల ఆదాయం వృత్తివారీగా ఎలా ఉండబోతుందో క్రింద సూచిస్తున్నాం. వ్యవసాయమే ముఖ్యవృత్తిగా ఉన్నవారు ఉపవృత్తుల ద్వారా పారిశ్రామిక - ఉద్యోగ - రాబడులలో 5 శతాంశలు అధికంగా పొందగలుగుతారని అంచనా వేయబడ్డది.

## వ్యక్తి ఆదాయము

| | 1931లో | 1962లో | పెరుగుదల |
|---|---|---|---|
| | రూ | రూ | |
| వ్యవసాయం | 114 | 220 | 93% |
| పరిశ్రమలు | 161 | 368 | 129% |
| ఉద్యోగాలు | 264 | 397 | 50% |

## 26. జీవన ఖర్చులు :

ఇంతవరకు మేము సూచించిన విధానాలు అతి దరిద్ర దశలో ఉన్నవారి ఆదాయాన్ని పెంపుచేయ జాలనవి. ఇక జీవన ఖర్చుల్ని తగ్గించటానికి మేము ప్రతిపాదించే విధానాలు రెండురకాలు.

(i) ప్రాథమిక మాధ్యమిక విద్యలు, ప్రయోజనవిద్య, వైద్యసహాయము... మొదలైనవి ప్రజలకు ఉచితంగా సాధించి పెట్టగల సంఘ సేవా సంస్థల నిర్మాణము.

(ii) విద్యుచ్ఛక్తి, రవాణా మొదలైన సౌకర్యాలు చౌక ధరలలో ప్రజలకు సప్లయి కాగల ప్రజావసర పరిశ్రముల స్థాపన,

## 27. ఉచితసేవాసంస్థలు :

విద్యా - వైద్యసౌకర్యాల నిమిత్తం ఒకసంపూర్ణమైన ప్లాను మా మొదటి విజ్ఞప్తిలో సూచించిఉన్నాం. ప్రతివ్యక్తి - ధనిక దరిద్ర విభేదం లేకుండా - విద్యా వైద్య సౌకర్యాలు పొందవలెనంటే - ప్రాథమిక విద్య, మాధ్యమికవిద్య, వయోజనవిద్య, గ్రామపట్టణ ఆసుపత్రిలలో వైద్యసహాయం-ఇవన్నీ ప్రజలకు ఉచితంగా లభ్యమయ్యేలాగు చెయ్యాలి. ఇందువల్ల జీవన ఖర్చులు చాలవరకు తగ్గిపోతాయి.

## 28. ప్రజావసర పరిశ్రమలు :

ప్రస్తుతం విద్యుచ్ఛక్తి, గ్యాస్, రవాణా - మొదలైన అవసరాలు కొలదిగా మాత్రమే సప్లయి అవుతున్నవి. వాటికయ్యేఖర్చులు అధికసంఖ్యాకులు భరించగలవికాదు. ఈ అవసరాలు అతివిరివిగా సప్లయి కావాలనీ - కౌటుంబి కోపయోగాలకు, గ్రామ కుటీర పరిశ్రమలకున్నూ, ఇవి జనసామాన్యానికి భారంకానిచౌకధరకే సప్లయి కావాలనీ - మాప్లానులో ముఖ్యంగా పేర్కొన్నాం. ఇలాంటి ప్రజావసర పరిశ్రమలు ప్రభుత్వపు ఆధిపత్యంలో ఉండటము—వాటికి సంబంధించిన లాభాల్ని కంట్రోలు చేయుటము—మంచిది.

## 29. జాతీయ విముక్తినిధి :

ఈ విధానాలన్నీ అమలు పరచి నప్పటికీ అవస్థ ణం మొదలైన ప్రాకృతిక ఆకస్మిక విపత్తులవల్ల కొన్ని తరగతులవారి జీవన పరిస్థితులు అభివృద్ధి చెందలేక పోవచ్చు. అందుకోసం 'నేషనల్ రిలీఫ్ ఫండు' అంటూ ఒకనిధి—క్షామ నివారణ నిధిలాంటిది—అంతకంటే బహుళ ప్రాభవం కలది—అవసరం వచ్చినప్పుడు ఉప యోగపడేందుకు—ఏర్పాటు చెయ్యాలని మాసూచన. ఈనిధిలో కొంత భాగము కొనుగోలు వస్తువుల రూపేణా నిలువ ఉంచినట్టయితే--అది ఆపన్నివారణావసరం వచ్చి నప్పుడు వెంటనే విని యోగించుకోవచ్చు.

## 30. సంఘశ్రేయం:

కనీస జీవన ప్రమాణం ఏర్పడి, లేమినిర్మూలం కావటం...మన ఆర్థిక పునర్నిర్మాణలక్ష్యం. అది సిద్ధిం చడానికి మా ప్రణాళిక పూర్ణవంతమైనదని చెప్పలేము ఎందుచేత నంటే—వ్యాధులు, వార్ధక్యం, సాంకేతిక శాస్త్రవిజ్ఞానం లేనందున సంభవించే నిరుద్యోగత— ఇలాంటి బాధలెన్నో ఉన్నవి. వీటన్నిటికీ ప్రత్యేక పరి హారాలు మాప్లానులో సూచితాలు కాలేదు. కొన్ని సాంఘిక భీమా పద్ధతులవల్లనే తప్ప వీటికి పరిహారంఏర్ప

డదు. అట్టి భీమాపద్ధతులు ప్రస్తుతం ఇండియాలో అత్యవసరం. అయినా వాటిని 1. నౌకరీలన్నీ సంపూర్ణంగా అందరి అందుబాటులోకి తీసుకువచ్చే ప్రయత్నాలు బాగాసాగి అధిక సంఖ్యాకులకు నిలకడ ఉద్యోగాలు కుదిరిన తర్వాత... అంటే ఇన్సూరెన్సువారు భరించవలసిన నష్టం (Risk) తగ్గిననాడు 2. అట్టిభీమా ప్రీమియములు కట్టుకోటానికి వ్యక్తి ఆదాయము తగినంతగా పెరిగిననాడు—అప్పుడుగాని వాటిని ప్రవేశ పెట్టటం సంభవంకాదు. కూలివాండ్ర కనిష్ఠ వేతనం నిర్ణీతమైన నాడు వ్యాధి భీమాపద్ధతిని ప్రవేశపెట్టవచ్చును; సెలవుల్లోకూడా పారిశ్రామిక పనివాండ్రకు జీతాలుఇచ్చే పద్ధతి అమలుపెట్టవచ్చును. ఫ్యాక్టరీ చట్టాలక్రింద వచ్చే అన్ని పారిశ్రామిక సంస్థలలోనూ గర్భిణీ స్త్రీలకు, బాలింతలకు ప్రస్తుతం చూపబడుతూన్న ఔదార్యం ఇంకా విశాలం కావాలి.

## 31 ఆదాయాల మీద పన్ను

ఇంతవరకు మేము సూచించిన విధానాలన్నీ జాతీయ ఆదాయం సక్రమంగా పంపకం అయేందుకు అంటే - ప్రతి వ్యక్తికీ ఒక కనీస జీవిత ప్రమాణంఏర్పడేందుకన్నమాట అది మన మొదటి ఆశయం. అట్టి

సక్రమ పంపకం వల్ల మన రెండవ ఆశయమయిన 'ధనికదరిద్ర విభేదాల నశింపు' కూడా కొంతవరకు సిద్ధిస్తుంది. ఇంతకంటే - ఈ విభేదాలు పోవటానికి పన్నులు విధించటం ఒక ముఖ్యసాధనం. అందువల్ల ధనవంతుల ఆదాయంలోని కొంతభాగం బీదప్రజల అవసరాలకు ఉపయోగ పడుతుంది, చక్కగా నిర్ధారింపబడిన ఆదాయపుపన్ను సొంత ఆస్తులు అట్టే పెరిగిపోకండా హద్దులు ఏర్పరుస్తుంది. పారిశ్రామిక వ్యావసాయికోత్పత్తుల అభివృద్ధికోసమయిన 'ఎస్సెట్లు' తగ్గుదలకూ, ఆదాయాల తరుగుదలకూ రెమిషన్ మాత్రం ఇవ్వవలసినదే స్వార్జితంకాని ఆస్తిమీద హెచ్చుపన్నులు వెయ్యాలి. ధనికదరిద్ర విభేదాలను సరిచెయ్యటానికి మరణసుంకాలు బాగా పనిచేస్తవి. ఇతర దేశాల్లో ఈపద్ధతి అనుసరిస్తున్నారు. ఇతర్ల ద్వారా సంక్రమించే ఆస్తిమీద తరాలు పెరిగిన కొద్దీ పన్ను పెంచవలె. ఈప్లాను అమలు జరిగేందుకు పరిపాలన ఖర్చులు పెరుగుతై; విద్యావైద్య సౌకర్యాలు మొదలైన ఉచిత సేవాసంస్థలు సాగటానికి ప్రజావసర పరిశ్రమలకూ ధనంకావాలి ఇత్యాది ఖర్చులన్నింటికి మన భవిష్యదార్థిక నిర్మాణం ఎక్కువగా పన్నులమీద ఆధారపడవలసి ఉంది.

## 32 అభివృద్ధి సర్వత్ర అవసరం:

ఈ స్థాను సంస్థానాలలోను. బ్రిటిష్ ఇండియా లోను కూడ అమలు జరగాలి అలా కాకపోతే దేశం లోని ఉత్పత్తి శక్తు లన్నింటినీ వినియోగించుకో లేక పోతాం. అనుకున్నంత ఉత్పత్తి అధికం చేసుకోగలిగినా కొనుగోలు శక్తి పెరగదు. పారిశ్రామిక విస్తరణలో గాని, మరి యితర విషయాల్లోగాని... సంస్థానాలు బ్రిటిష్ఇండియాకు వెనుకపడి ఉన్నాయి కాని మనప్లాను బ్రిటిష్ ఇండియాకు, సంస్థానాలకు కూడా వర్తింపచేయటం భావి భారతీయ-ఆర్థిక స్వాస్థ్యానికి అత్యవసరం. రెండింటి పురోవృద్ధులు పరస్పరాశ్రితాలే. భారత దేశ ఆర్థిక పునర్నిర్మాణానికి పడవలసిన కష్టము, చేకూరేఫలితము ... రెండూ పంచుకోవాలి. దేశంలో ఐదింట రెండువంతులు సంస్థానాల జనసంఖ్య. మొత్తం జన సంఖ్యలో నాలుగోవంతు అయినా సంస్థానాల్లోను, బ్రిటిష్ ఇండియాలోను ... ప్రస్తుతపు పారిశ్రామిక పెట్టుబడులకు ఆదామాషా ప్రకారం పోలికే లేదు. మొదట ఈ అంతరం పూడిపోతేనే తప్ప దేశంలో ఆర్థికాభివృద్ధి సర్వాంశకమంగా ఉండజాలదు. బ్రిటిష్ఇండియాలోను, సంస్థానాలలోను ఉత్పత్తి సంస్థల పెట్టుబడులలోని వ్యత్యాసాలు సవరణ కాకపోతే దేశంలోని

పారిశ్రామికాభివృద్ధి సర్వతో ముఖంగా ఉండదు. ఎందువల్లనంటే - స్థానికంగా ఉండే పన్నులలో తేడాలు కూడా పరిశ్రమ ఫలితాల్ని దెబ్బ కొడతాయి.

## 33 కఠినమయిన పన్నులు విధించే పరిస్థితులు:

మేము సూచించిన పన్నుల విధానం ప్రజలకు భారంగా తోచవచ్చును. కాని వాటిద్వారా మనము ఆశించే ఫలితాలను గురించి ప్రజలకు హామీ ఇవ్వాలి ఎవరు? ప్రజలబాధ్యతవహించవలసిన జాతీయప్రభుత్వం. సామ్రాజ్యవాదం నరనరాల ప్రాకిపోయిన పర ప్రభుత్వం చేతిలో పన్నులు విధించే అధికారాలు ఉండటం ఎంత అపాయకరమయిన విషయమో... పూర్వానుభవంవల్ల మనకు తెలుసు, కనుకనే ఈ విషయం ఒత్తి చెప్పటమయింది, మా ప్లాను సాగటానికి దాని కయ్యే ఖర్చులు భరించటానికీ, ఒక బాధ్యతాయుత జాతీయ ప్రభుత్వం తప్పని సరిగా ఏర్పడాలి లేక పోతే ప్లాను సరియైన పద్ధతుల్లో సాగుతుందనీ, సరియైన ఫలితాలు పొందగలమనీ నమ్మకంలేదు; పైగా అందుకోసం ముందుకు వచ్చే పెట్టుబడి శక్తులన్నింటినీ తెలివితేటలతో; ఫలోన్ముఖముగా వినియోగించుకోనూ లేము....

# ప్రభుత్వము - ఆర్థికనిర్మాణము

34. ఆర్థిక నిర్మాణ స్వరూపం :

సక్రమమైన జాతీయాదాయ పంపక విధానాలు చాలవరకు ఉత్పత్తి విధానాలమీద ఆధారపడిఉంటాయి కనుక భారత దేశ పరిస్థితులనుసరించి మాప్లాను అమలు జరగటానికి తగిన ఆర్థిక నిర్మాణ స్వరూపం తెలుపుదు చెయ్యటం కూడా అవసరమే. ఈ విషయాన్నిగూర్చి భేదాభిప్రాయాలున్నాయి, చాలకాలంనించీ అనేకవిధాలుగా చర్చిస్తున్నారు. పూర్వాభిప్రాయాలన్నీ జీర్ణించుకుని ఒక క్రొత్తమార్గాన మనమీ విషయాన్ని అభిగమించవలసిఉన్నది. మానవ - భౌతిక శక్తులన్నింటినీ కూడ గట్టుకోవటమే మనప్లాను యొక్క ముఖ్యోద్దేశం. వాటిని మనం గట్టలాభం చేకూరేలాగు వినియోగించుకో వలె. కాగా ప్లాను ప్రజల దృక్పథానికి, సాంప్రదాయానికీ, అనుగుణ్యంగా ఉండాలి; అందుకు వారు మోయవలసిన భారంఅధికం కాకూడదు; వ్యక్తిస్వాతంత్ర్యానికి ముప్పురాకూడదు.

35 ప్రభుత్వపు జోక్యం ప్లానులో ఒకభాగమే.

నియంతృత్వాధికారం గల ప్రభుత్వపు రాజకీయవాతావరణంలోనే తప్ప పునర్నిర్మాణ విధానాలు

సాగజాలవని బహుళజనాభిప్రాయమయి ఉన్నది. జౌను మరి, ఇటీవలగా ఆర్థిక అభివృద్ధికి కృషిచేసిన రష్యా—జర్మని దేశాలలో ప్రభుత్వం ప్రజల అన్నిజీవిత శాఖలలోనూ వ్యక్తిస్వాతంత్ర్యానికి భంగకరమైనంత అధికారము కూడా చెలాయించింది. సర్వాంకషమయిన ఒక ఆర్థిక పురోభివృద్ధికైన ప్రణాళిక ఓనమాల దగ్గరనించీ ఆరంభించవలసిన దేశంలో ప్రభుత్వం తప్పని సరిగా... ప్రజల మంచికోసం... జోక్యం కలిగించుకోవలసిందే; యాజమాన్యం వహించవలసిందే! ఈ సంగతి మా మొదటి విజ్ఞప్తిలోనే సూచించాం. ఒక కేంద్రాధికారం ఏర్పడవలె వహించవలసిన ఆర్థిక భారం ఎవరికీ దుర్భరం కాకూడదు, చేయించవలసినవి చేయిస్తూ, నిషేధించవలసినవి నిషేధిస్తూ ప్రభుత్వం పైయెత్తున వుంటేనే తప్ప మా ప్లాను ప్రతిపాదించే ఆర్థికపురోభివృద్ధి మార్గాలు సుగమం కాజాలవు. ప్రభుత్వాధికారం ప్లానులో అంతర్గర్భితము.

36 ప్లాను, ప్రజాస్వామ్యము.

---

అట్లని ప్రజాస్వామ్య సిద్ధాంతాల్ని శోధిసి రాజంటేనే తప్ప ఏసంఘంలోనూ సర్వాంగ సమస్తమైన ఆర్థిక ప్రణాళిక సాగదని అర్థంకాదు. తార్కికంగా కాని, చారిత్రికంగా కాని అల్లా అనుకోటానికి ఆస్కా—

గం లేదు, తమ శక్తుల్ని యుద్ధనిర్వహణకు విజయవం తంగా కూడగట్టుకో గలుగుతూన్న ప్రజాస్వామ్య దేశాలు తమ ప్రజల్లో దారిద్ర్యం, అనారోగ్యం, నిరక్షరాస్యత మొదలైన కష్టాలంతా నిర్మూలించటానికి ఆయుధధారణ చెయ్యలేకపోతాయా? ప్రజాస్వామ్య ఆశయాల్లో వ్యక్తి స్వాతంత్ర్యం ముఖ్యమయినది. అత్యంత - ఉచితప్రయోజనాల కోసం తప్ప ప్రభుత్వం వ్యక్తిస్వాతంత్ర్యానికి అడ్డురాజాలదు. అప్పటికీ ప్రజా ప్రతినిధుల ద్వారా సంఘంయొక్క ఒప్పుదల కావాలి ఎంతయినా భిన్నాభిప్రాయాలు గల పార్టీలవారికి శృంఖలాలు ఉండవు. అట్టి వ్యక్తిస్వాతంత్ర్య నిరోధమున్నా స్వల్పకాలావసితమే; నియంతృత్వ దేశంలో అలా కాదు వ్యక్తి ప్రభుత్వంలో అంతర్హితుడు. ప్రభుత్వం ఇచ్చినవి తప్పితే అతనికి ప్రత్యేక హక్కులు లేవు. ప్రజాస్వామ్య దేశాల్లో ప్రభుత్వం ప్రజలది. వ్యక్తిహక్కులను ప్రభుత్వం కాపాడాలి కనుక ప్రభుత్వం వ్యక్తి స్వాతంత్ర్యానికి అడ్డు వచ్చేలాగైతే అందుకు తగినంత కారణం ఉండాలి. మన ప్లానింగుకూడా ప్రజాస్వామ్య నిర్మాణం వంటిదే ప్రభుత్వం వహించవలసిన బాధ్యతలకు ప్రజలు అనుమతించవలె. ప్రజల యిష్టానుసారం

స్వీకరించిన అధికారం ప్రభుత్వం వినియోగిస్తుంది. అప్పుడు మనప్లాను మంచి ఫలితాలను కంటుంది.

37 ప్రాథమిక సూత్రాలు :

మనప్లానింగు కనువైన వివిధ ఆర్థికవిధానాలను చర్చించుకునే టప్పుడు ఒక్కవిషయాన్ని గమనించాలి: ఈనాడు పెట్టుబడి విధానానికీ (Capitalism) సామ్య వాదానికీ (Socialism) ఉన్న భేదాలు నరీ ఉత్ప్రేక్షి తము లౌతున్నవి. పెట్టుబడి సంస్థలలో ప్రభుత్వపు జోక్యం పనికి రాదన్న అభిప్రాయం మారుతూన్నది. గత నూరు సంవత్సరాలలోనూ ప్రభుత్వం అనేక ఆర్థిక వ్యవహారాలలో కలుగ జేసుకుంటూ ఉన్నది. కాగా పెట్టుబడి విధానం క్రమేణా మారుతూఉన్నది. అలాగే సామ్యవాద దేశాలలో కూడా జీవంగల సాం ఘిక వ్యవస్థా నిర్మాణానికి కొన్ని ముఖ్యవిషయాల్లో పెట్టు బడి విధానాన్ని అంగీకరిస్తున్నారు. కాగా పెట్టు బడి విధానము, సామ్యవాదము పరస్పరాభి ముఖంగా వస్తున్నాయి. అంతరం గడచి రెండున్నూ ఒకే పునాది రాయిమీద నిలువగలవు. ఈ రెండు విధానాలలోని సూత్రాల సమన్వయం వల్లనే ఏఆర్థిక నిర్మాణమైనా ఫలవంతంగా, శాశ్వతంగా సాగుతుంది. ఆసూత్రాలు ఏమంటే—(1) వ్యక్తిగత ఉత్సాహానికీ, పూసికకూ తగి

నంతఅవకాశం ఉండాలి. (2) వ్యక్తి స్వాతంత్ర్యభంగం కాకండా సాంఘిక హక్కుల రక్షణ ఉండాలి (3) ఆర్థిక నిర్మాణం సాగించటానిక్నీ, ఆర్థిక శక్తుల నన్నింటినీ వృద్ధి చేయటానిక్నీ భారతీయ ప్రభుత్వం బాధ్యత వహించాలి. భారతీయ ఆర్థిక నిర్మాణ విధానంలో సంస్థానాల స్థానం నిర్ణయించేందుకు ఈ దృక్పథాన్నే అనుసరిస్తున్నాం. వ్యక్తిఉత్సాహానికి: పూనికకూ దోహదం ఇచ్చేపెట్టుబడి విధానం భారతీయ ఆర్థిక పునర్నిర్మాణానికి కొంతవరకు ఫలోన్ముఖము కాగలదని మా నమ్మిక. అయినా ప్రజా క్షేమాన్ని, ప్రజల ఆర్థిక శ్రేయాన్ని పాటించక... 'నాబాగు, నామంచి' అని పాటుపడే స్వార్థపరుల దుర్మార్గాన్ని అరికట్టగల అధికారాలు సంఘానికి ఉంటేనే తప్ప... ఎట్టి ఆర్థికప్రణాళికయైనా ప్రజల జీవన ప్రమాణాన్నిగాని, సార్వజనిక శ్రేయాన్నిగాని హెచ్చించలేదు "ప్లానింగు, వ్యక్తిస్వాతంత్ర్యము—రెండింటి సమన్వయమే ఈదేశంలో ప్రధానసమస్య కేంద్రాధికారము, వ్యక్తిస్వాతంత్ర్యము పరస్పర వినాశకారణములే, కాని అవి విడతీసి... ఎప్పుడేది ఏ సమస్యలకు ఉపయోగించవలెనో తెలిసి... అలా వాడుకుంటే... ఆరెండు పునాదిరాళ్ళమీద ఉత్కృష్టమైన ఆర్థిక నిర్మాణం లభిస్తుంది.

## 38. ప్రభుత్వపు బాధ్యత :

ఆర్థిక నిర్మాణం విషయంలో ప్రభుత్వం నిర్వహించే పాత్ర ఎట్టిది? ప్లాను అమలు జరిగి ఒక ఆర్థిక నిర్మాణం ఏర్పడినప్పుడూ... ప్లాన్ అమలు జరిపే కాలంలోనూ... ప్రభుత్వపు బాధ్యతలలో భేదాలు ఉండవలె ప్లాన్ అనంతరం ప్రభుత్వపు ధర్మాలు ముందు నిర్వచిస్తున్నాం.

## 39. ప్రభుత్వ బాధ్యతల స్వరూపం :

ఆర్థిక స్వాస్థ్యాన్ని కాపాడటం, కరెన్సీ ఫైనాన్సుల మేనేజిమెంటు, లెక్కవారీగా వివిధవిషయాల వివరాలు ప్రోగుచేయటం, ఆర్థికంగా వెనుకపడియున్న వారి శ్రేయస్సుకోసం చట్టాలు నిర్మించటం — ఇవి ప్రభుత్వపు సాధారణ బాధ్యతలు; అందరికీ తెలుసు. అంతేకాక విజ్ఞుల అభిప్రాయంలో ఇంకాకొన్ని విశేష బాధ్యతలు ఉండవలె. అవియేమంటే—ఆర్థిక సంస్థల 1. ఆధిపత్యం 2. అధికారం 3. మేనేజిమెంటు. పెట్టుబడి విధానంలోని కొందరు వ్యక్తుల స్వార్థపరత్వంవల్ల కొనుగోలుదారు అవసరాలు సంఘశ్రేయస్సు కుంటుపడుతున్నవి. కనుక యీ బాధ్యతలు ప్రభుత్వపువరం చెయ్యవలసివస్తున్నది ఈ మూడువిధాల ప్రభుత్వపు బాధ్యతలను నిర్ణయించవలసి యున్నది.

## 40. అధికారం అత్యవసరం :

సంఘ శ్రేయస్సు కోసం పై మూడింటి లోనూ ప్రభుత్వపు అధికారం ముఖ్యమైనది. సంఘ క్షేమానికి ఉత్పత్తి శక్తులన్నింటినీ కూడ గట్టి ఫలోన్ముఖంగా వినియోగించటంముఖ్యకర్తవ్యం. ఇందుకు ఆర్థిక సంస్థలమీద ప్రభుత్వపు ఆధిపత్యంగాని, మేనేజిమెంటుగాని ఉండ నక్కరలేదు. సక్రమంగా, సదుద్దేశంతో వినియోగించ గల అధికారం ఉంటేచాలు. అట్టిఅధికారం పెట్టుబడి దార్ల స్వార్థపరత్వానికి సంకెళ్లు వేస్తుంది. పెట్టుబడిదార్లు ఆర్థిక సంపత్తిని ఇష్టం వచ్చినట్టు వినియోగించుకోవటం తప్పుతుంది. ఉత్పత్తి తగ్గించి, ధరలు పెంచి, లాభాలు గడించే విధానాలు అంతరిస్తాయి. దేశభవిష్యదవసరా లను గుర్తించకుండా స్వల్పంగా ఉత్పత్తి అయ్యే పదా ర్థాల్ని తామే 'స్వాహా' అనటం పోతుంది. సొంతఆస్తుల మీద ఉండే హక్కులున్నా తగ్గిపోతై. ఈ విషయాలు దృక్పథంలో పెట్టుకుని ప్రభుత్వపు బాధ్యతలను క్రింది పేరాలలో నిర్వచిస్తున్నాం.

## 41 ప్రభుత్వపు ఆధిపత్యం :

ప్రజాక్షేమం కోసం, రక్షణకోసం ప్రభుత్వపు ధనంతో నడిచేసంస్థలన్నీ ప్రభుత్వపు ఆధిపత్యంలోఉండ

వలసిందే. ఆధిపత్యం లేని కేవల అధికారం ఉపయోగించని పరిశ్రమలు కూడా ప్రభుత్వపు ఆధిపత్యంలో చేరవలసినదే. మొదటిరకంలో చేరేవి, ప్రారంభదశలో ప్రభుత్వపు ఆర్థిక సహాయం అవసరమైన కొత్తకొత్త పరిశ్రమలు. కాలక్రమేణా వీటిని పెట్టుబడిదార్లే నడుపుకోగలిగిననాడు ప్రభుత్వం తన ఆధిపత్యాన్ని వదలుకోవచ్చును; కాని అధికారం ఉండవలసినదే రెండవరకపు పరిశ్రమలలో ప్రభుత్వపు ఆధిపత్యం అవసరం కాబట్టి అది శాశ్వతంగా ఉండేదే. అధికార వినియోగంకోసం ఆధిపత్యం వహించవలసి వస్తున్న ఈరకపు సంస్థల మేనేజిమెంటుకూడా ప్రభుత్వానికే ఒప్పజెప్పటం అవసరం ఈ రకంలో చేరేవి యుద్ధపరికర పరిశ్రమలు, పోస్టు, టెలిగ్రాఫ్ మొదలైన రవాణావస్థతులు.

## 42. ప్రభుత్వపు అధికారం :

ఇంతో అంతో ప్రభుత్వపు ఆధిపత్యాన ఉన్న సంస్థలు, భారీపరిశ్రమలు, ప్రాతిపదిక పరిశ్రమలు, ప్రజావసర పరిశ్రమలు, ఏక స్వతంత్ర పరిశ్రమలు, ప్రభుత్వపు ధనసహాయం పొందే పరిశ్రమలు — ఈ మొదలైనవన్నీ ప్రభుత్వపుఅధికారంలో ఉండవలసిందే. ఈఅధికారంయొక్క స్వరూపం పరిశ్రమల్నిబట్టిమారుతూ

ఉంటుంది. ధరల నిర్ణయం; వాటాల వినిమయం: పనిచేయు ఎరతులు కూలిజీతాలు ఏర్పాటు చేయటం; మేనేజిమెంటువర్గంలో అధికార డైరెక్టర్లను నియమించ టం: లైసెన్సులు జారీచేయటం— ఈ మొదలైనవి ప్రభుత్వపు వివిధఅధికారాలు. వివిధ పరిశ్రమలలో కేవ లం ఆర్థికవృద్ధినేకాక ప్రజాశ్రేయం కూడా కనిపెడుతూ ఉండాలి ప్రభుత్వం.

## 43. ప్రభుత్వపు మేనేజిమెంటు :

ప్రభుత్వపు ఆధిపత్యం ఉన్నచోట ప్రభుత్వపు మేనేజిమెంటు కూడా ఉండవలసిందే. కాని ఇది అన్ని సంస్థలకూ వర్తించదు. ప్రభుత్వము, పెట్టుబడిదార్లు, మునిసిపాలిటీ ఈ ముగ్గురూ మేనేజిమెంటుకు అర్హత కలవారు. కాని ఒకానొక సంస్థకు ఈముగ్గురిలో ఎవరు మేనేజుమెంటు వహించాలి అనే ప్రశ్నవచ్చినప్పుడు... అందుపూనుకని ముందుకు వచ్చే వ్యక్తులను బట్టి నిర్ణ యించవలసి వుంటుంది. కొన్ని పరిశ్రమల్ని ప్రభుత్వం చేతిలో ఉంచుతున్నాం అంటే ప్రజాశ్రేయం రక్షించి కదా! కాబట్టి సమర్థతతో మేనేజిమెంటు చేయగలగట మేకాదు కావలసింది. దానితోపాటు ప్రజాక్షేమము, శ్రేయస్సు ఎంతవరకు పరిరక్షితా లౌతున్నవీ అన్నవిష

యం కూడా ఆలోచించాలి. కాబట్టి ఈ విషయంలో ఒక సర్వసాధారణమైన నిర్వచనం చెయ్యటానికి వీల్లేదు గుణ గుణాల్ని బట్టి తేల్చుకోవలసిందే. ప్రభుత్వపు అధికారంచాలక, ప్రభుత్వపు మేనేజిమెంటు కూడా అవసరమా, కాదా!—అన్న విషయం తేల్చుకొని పైవిషయాన్ని నిర్ణయించుకోవాలి.

## 44 సమరస విధానం:

ఒకానొక సంస్థ పెట్టుబడిదార్ల అధీనంలో ఉండవచ్చునా, లేక ప్రభుత్వం ఆధిపత్యం వహించవలసిందేనా?—అన్న నిర్ణయం తేల్చుకునేందుకు కొన్ని సూచనలు ఇచ్చాం కాని అవి కొన్ని సందర్భాలలో ఉపయోగించక పోవచ్చు. ఇంకా సమన్వయం చెయ్యవలసిన ఎన్నో విషయాలు ఉంటాయి అటువంటప్పుడు చెయ్యతగిన పనియేమంటే—ఆపారిశ్రామిక సంస్థలోని కొన్ని అంశాలు పెట్టుబడిదార్ల అధీనంలోను, మిగిలినవి ప్రభుత్వపు అధీనంలోనూ నడపటం, ఒక వంక సామర్థ్యం గల మేనేజిమెంటు; మరొక వంక ప్రజాక్షేమమూ-రెండూ సిద్ధించగల విధాననిర్ణయం సాధ్యం కానప్పుడు పెట్టుబడి దారుయొక్క ప్రభుత్వం యొక్క సహకార సామరస్యాలు ఎంతో పనిచేయగలుగుతవి. ప్రజావసర పరిశ్రమలు, కేవలం ప్రభుత్వపు అవసరా

లను ఉత్పత్తి చేసే పరిశ్రమలు ఈ తరగతిలో చేర్చ వచ్చు. ఒక పరిశ్రమను...కొంత భాగం మీద ప్రభుత్వము, మరి కొంత భాగంమీద అనధికారవర్గము మేనేజిమెంటు వహించటం వల్ల ఆ పరిశ్రమకు స్థిరత్వం ఏర్పడుతుంది ఆరెండు రకాల మేనేజిమెంట్లు పరస్పరము సరిదిద్దుకుంటూ... పరిశ్రమను ప్రజోపయోగము చేయగలుగుతవి, ఉత్పత్తి విధానాల నన్నింటినీ ఒక్కసారిగా సామ్యవాద సిద్ధాంతాను గుణ్యములు చేయనక్కరలేదు, అలా చేయబడిన పారిశ్రామిక సంస్థలను-సామ్యవాదం వల్ల మంచి ఫలితాలు లభించనప్పుడు - తిరిగి అనధికారవర్గాల యాజమాన్యానికి వొప్పజెప్పటంలో తప్పేమీ లేదు. ఒకే ఉత్పత్తి సంస్థలో కొన్ని భాగాలు సామ్యవాద సిద్ధాంతాను గుణ్యములు చేయతగినవి ఉండవచ్చును; పెట్టుబడిదార్ల ఆధిపత్యంలోనూ, అధికారంలోనూ మాత్రమే ఉండదగిన భాగాలూ ఉంటాయి. "వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఎంత తక్కువగా నిగ్రోధిస్తే...కొత్తకొత్త పరిశోధనల కంత అవకాశం ఉంటుంది: వివిధములైన అభిరుచులుగల పనివాండ్రకు వారు వారు కోరే సౌఖ్యాలకు అనుగుణ్యాలైన నౌకరీలు చేకూర్చి పెట్టడానికి వీలౌతుంది."

## 45 ప్లానింగ్ కాలంలో ప్రభుత్వాధికారం:

ఆర్థిక క్షేత్రంలో పై వివరించిన ప్రభుత్వపు సాధారణ బాధ్యతలు ప్లాన్ అమలు జరిగే కాలంలో కూడా వర్తిస్తాయి. అంతేకాక ఇంకా అనేక తాత్కాలిక- అధికారాల్ని కూడా ప్రభుత్వం చలాయించవలసి ఉంది. లేకపోతే ఆర్థిక పురోభివృద్ధి అసాధ్యమే పోతుంది. అట్టి అధికారాలు చాలవరకు ప్రస్తుతయుద్ధసమయంలో అమలులో ఉన్నటువంటివే దేశం వాటికి అలవాటుపడి ఉన్నది కూడాను. అయినా వాటిని సక్రమంగా ప్రజాభీష్టం ప్రకారం చలాయించవలె.

## 46 అధికారాల వివరణ

ఈ అధికారాలు ఈక్రింది క్షేత్రాలలో వినియోగము లౌతవి:—

i) ఉత్పత్తి
ii) పంపకం
iii) కొనుగోలు
iv) పెట్టుబడి
v) విదేశవ్యాపారము అండ్ మారకం
vi) కూలిజీతాలు అండ్ పని చేయు షరతులు

ఉత్పత్తి క్షేత్రంలో ప్రభుత్వాధికారం... వివిధ పరిశ్రమలు సర్వప్రాంతాల విస్తరించి అనుకున్నంత అధికోత్పత్తి సాధించేందుకు... ఉపయోగ పడాలి. లైసెన్సుల విధానం అమలుపెట్టి ఉన్న పరిశ్రములు వృద్ధి చెయ్యటానికి, క్రొత్తవ శ్రమల్ని స్థాపించటానికీ ప్రభుత్వం పాటుపడాలి. ముడిపదార్థాలు, సగం తయారైన వస్తువులు, పెద్దవస్తువులు—వీటిలో ఏదిముందుగా విడుదల కావాలి అనేవిషయనిర్ణయమే పంపక విధానంలోని ప్రభుత్వపు అధికారం. ప్లాను అమలు జరిగే కాలంలో శేషనింగు, కొనుగోలుదార్ల అవసరాల విభజన ప్రభుత్వాధికారంలోనే ఉంటాయి. కొనుగోలు విషయంలో ప్రభుత్వాధికారం యొక్క లక్ష్యాలుఏమంటే అవసర వస్తువులయొక్క... ప్రభుత్వసహాయాన నడిచే పరిశ్రమల్లో ఉత్పత్తి అయ్యేవస్తువుల యొక్క... అమ్మకపు ధరలు సమంజసంగా ఉంచటము—ఇన్ఫ్లేషన్ను అణచి వేయటము పెట్టుబడి విషయంలో కూడా ప్రభుత్వాధికారం అవసరం. కొత్తపెట్టుబడులు ప్రభుత్వపు అంగీకారానికి బద్ధములై ఉండవలసినదే పెట్టుబడులు వికేంద్రీకృతాలు కావటానికి, ఇన్ఫ్లేషన్ను అణచటానికి, జాతీయక్షేమం కాపాడటానికి— ఈఅధికారం ప్రభుత్వానికే ఉండాలి. వర్తకము మారకము వ్యవహా

రాలతో ప్రభుత్వపు అధికారం—విదేశాలతో టి డబ్బు చాలామణి నష్టదాయకంగా పరిణమించకుండా, భారతీయ పరిశ్రమలు సుస్థిరంగా ఉండేందుకు —వినియోగముకావాలి ముఖ్యంగా ప్రభుత్వరక్షణపొందే పరిశ్రమలలోను, ప్రజావసర పరిశ్రమలలోను ... చక్కని మేనేజిమెంటు కావలి, పని బాగా సాగేందుకుగాను కూలివాండ్రు పనిచేయవలసిన షరతులు, వారి జీతాలు ప్రభుత్వాధికారము కనిచూడవలె.

## 47. జాతీయ ప్రభుత్వం :

ఈ ఆధిపత్యము, అధికారము, మేనేజిమెంటు బాధ్యతాయుత జాతీయ ప్రభుత్వము స్వీకరించాలి. అప్పుడు ప్లాను ఫలోన్ముఖ మవుతుంది "భౌతికంగా కాక నైతికంగా అనేక సంఖ్యాకులైన ప్రజలు ఆజ్ఞాబద్ధులుగా ఉన్నప్పుడే ప్రభుత్వాధికారం నిర్మాణకార్యక్రమాన్ని ఫలవంతంగా సాగించ గలుగుతుంది" ఈ నైతికబలం చేకూరటానికి దేశంలోని వివిధ రాజకీయ పార్టీల ప్రతినిధులతో కూడిన సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడాలి కర్తృత్వం అంతా కేంద్రప్రభుత్వం ఉంచుకొని ఆర్థిక నిర్మాణ బాధ్యతలను రాష్ట్రీయ - స్థానిక పాలక వర్గాలకు ఒప్పజెప్పవచ్చును. కాని వికేంద్రీకరణ సూత్రం మరువరాదు. సంపూర్ణంగా ఆర్థికశాస్త్ర పరి

జ్ఞానము అనుభవము కలిగిన పెద్దల చేతుల్లోనే పెత్తనం ఉండాలి లేకపోతే మేము పైనఉదహరించిన ఆశాశ్వత తాత్కాలిక, అధికారాలు నిష్ప్రయోజనములే కాగలవి. ఆర్థిక కార్యక్రమానికి కావలసిన తర్ఫీతు, అనుభవము గల విజ్ఞులతో కూడిన Economica civil service అనే సంస్థ ఒకటి స్థాపించాలి.

## 43 భవిష్యదార్థికవ్యవస్థ:

మన యీ ప్లాను చక్కగా సాగినప్పుడు లభ్యమయ్యే భవిష్యదార్థిక వ్యవస్థ చాలవరకు... "సామ్యవాదము- ధనస్వామ్యము" అనే గ్రంథంలో ప్రొఫెసర్ పిగో సూచించిన సాంఘిక వ్యవస్థను పోలి ఉంటుంది. మనం కోరే వ్యవస్థ, మనం వాంఛించే ప్రభుత్వబాధ్యతలు... ఆయన వ్రాసిన అంశాలకు అనుగుణ్యాలే కనుక ... ఆ గ్రంథంలోని వాక్యాలు కొన్ని ఇక్కడ ఉదహరిస్తున్నాం: "నా దేశపు ముందుగతిని నిర్ణయించే అధికారం నా చేతుల్లోనే ఉంటే... ప్రస్తుతానికి ఈధనస్వామ్య పద్ధతిని అంగీకరిస్తాను: కానీ క్రమేణా దాన్ని మార్పులు చేస్తాను. మరణ సుంకాలను, ఆదాయపు పన్నులను... కేవలం రివిన్యూ సాధనాలుగా గాక ... ప్రస్తుత నాగరకత కళంకాలుగా ఉన్న

ధనిక దరిద్ర విభేదాలను, ఆర్థికేతర తమ భావాలను నిర్మూలించే ఆయుధాలుగా ఉపయోగిస్తాను. ప్రజల ఆరోగ్యం, విజ్ఞానం, శీలం – వీటిని పెంపుచేసే నిమిత్తం పెట్టే పెట్టుబడే నికరమైన పెట్టుబడి - అని రష్యాదేశం నాకు నేర్పిన గుణపాఠం. ఈ వ్యవహారాలలో పిసినిగొట్టుతనం చూపటము క్షంతవ్యంగాని అపరాధము. ప్రజావసర పరిశ్రమల మీద, ఏక స్వాతంత్ర్య వ్యాపారాలమీద... ప్రజల పర్యవేక్షణ అధికారం ఉండేలాగు చేస్తాను. ఆయుధ పరికర పరిశ్రమలు, బొగ్గు పరిశ్రమ, రైల్వేలు మొదలైనవన్నీ ప్రజాయత్తములు చేస్తాను; అంటే... పోస్టాఫీసుల్లాగ కాదు... ప్రజల కమిటీల అధికారంలో ఉంచి ఇంగ్లండు బ్యాంకును ఒక ప్రజాసంస్థనుగా చేస్తాను; పరిశ్రమలలోను, ఉద్యోగాలలోను ఆకస్మికంగా కలిగే మార్పులను అరికట్టేందుకు ఆసంస్థ తన అధికారాన్ని వినియోగించాలి. సర్వం చక్కగా సాగిపోతూంటే... ఇంకా ఇతరములైన ముఖ్యపరిశ్రమల్నికూడా ప్రజాయత్తం చేస్తాను. ఇలా ప్రజాయత్తాలు చేయబడిన ఈ పరిశ్రమల్ని సాగించటానికి, వృద్ధినొందించటానికి... కేంద్రప్రభుత్వానికి ఒకప్లాను ఉండాలి. ఎందుకంటె... ప్రతిసంవత్సరం వచ్చే లాభాల్లో అధిక భాగం క్రొత్త పెట్టుబడుల క్రింద వినియోగించేటందుకు

ఈ పనులన్నీ నిర్వహించిన తర్వాత సంతృప్తితో నా అధికారానికి స్వస్తి చెబుతాను. నా తరువాత అధికారంలోకి వచ్చేవారికి కూడా క్రమ క్రమాభివృద్ధి పథకాన్నే అందించి పోతాను. తిన్నతిన్నగా మార్పులు చేసుకుంటూ నిర్మాణం సాగించుకోవాలి, ఒక్కసారి దూకుడుగా ఊడబెరికి వేస్తామంటే లాభం లేదు. నా చివరి సందేశము ఇంకొకటి, నెమ్మదితనంలోనే కార్యపరత ఉన్నది అదిసోమరి తనానికి నాజూకు పేరు కానే కాదు.

సరస్వతీ ప్రెస్ బెజవాడ, 24-8_45 కాపీలు 250

# దేశీ ప్రచురణలు

| | | |
|---|---|---|
| గాంధీ ప్రభుత్వ లేఖలు | 2 | 8 |
| గాంధీ ప్రణాళిక | 1 | 12 |
| మనజమీందారీలు | 1 | 0 |
| బొంబాయి ప్రణాళిక 1 భా | 0 | 12 |
| పాకిస్థాన్ | 0 | 12 |
| గాంధీవాదము | 0 | 8 |
| సామ్యవాదము | 0 | 3 |